REG No 757

శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని. జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.
గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 6 | 1914 మార్చి | సంచిక 3

విషయములు.

1 గ్రంథస్వీకారము
2 హితబోధ
3 భక్తి
4 శివానందలహరి, తంగెడ రామకృష్ణకవి
5 తిరుపతి వేంకటేశ్వర తత్త్వము. శిష్టా హనుమచ్ఛాస్త్రి
6 స్వర్ణకార వ్యవహారము, పత్రికాధిపతి
7 శంతను రాజచరిత్ర, అన్నమరాజు గనునయ్య

చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు—

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | అళ్ళయాచార్యవిజయము | ... ... | రు. 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి | ... ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయము | ఇవి నాటకములు. | 0 | 4 | 0 |
| 4 | కంసవధనము | | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి | ... ... | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షగురుపరంపర | ... ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | | 0 | 2 | 0 |
| 8 | వత్సల నీతిశతకము | ... ... | 0 | 1 | 6 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము | ... ... | 0 | 2 | 0 |
| 10 | అత్యద్భుతవిమర్శనము | ... ... | 0 | 5 | 0 |
| 11 | నర్సరావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | 3 | 0 |
| 12 | లక్ష్మీవిలాసము | ... ... | 0 | 4 | 0 |
| 13 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము | .. | 0 | 4 | 0 |
| 14 | పశ్యాంపుశ్యాం | ... ... | 0 | 2 | 0 |
| 15 | సంగదోష | ... ... | 0 | 3 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము | ... ... | 0 | 3 | 0 |
| 17 | వీరభాగవతము | ... ... | 1 | 4 | 0 |
| 18 | పుళిందావివాహము | ... ... | 0 | 4 | 0 |
| 19 | గురిగింజ | ... ... | 0 | 1 | 0 |
| 20 | గుంటూరుసీమ, తిరుపతివేంకటీయము | ... | 1 | 0 | 0 |
| 21 | వేమవరాగ్రహారశతావధానము | ... | 0 | 12 | 0 |
| 22 | పిష్టపేషణము | ... ... | 0 | 1 | 0 |
| 23 | వ్యాసనిష్కాసనము | ... ... | 0 | 1 | 0 |

# అభినవసరస్వతి

| సంపుట 6. | జానపాడు<br>ప్రమాది సం॥ ఫాల్గుణమాసము | సంచిక 3. |
|---|---|---|


## గ్రంథస్వీకారము.

శ్రీమహాభారత శ్రీమద్రామాయణవిమర్శము, హిందూమతము, వివిధపద్యగుచ్ఛము, సకింద్రాబాదు శతావధానము, ప్రచండమార్తాండము, మందారమంజరి, కర్పూరతిలక, సువర్ణమాల, లిఖిత గ్రంథ సూచీపత్రము, ఆనందనామ సం॥ పంచాంగము, అను గ్రంథములు మా కార్యస్థాన మలంకరించియున్నయవి. అవకాశానుసార మీ గ్రంథములఁ జక్కఁగాఁ బఠించి మా యభిప్రాయ మీఁగలము. కావున గ్రంథకర్తలు త్వరపడకుందుటకుఁ ప్రార్థితులు.

## హితబోధ

"మూర్ఖాణాంపండితాద్వేష్యాః"

"ఓం శాంతిశ్శాంతిః"

శాస్త్రిలుగారూ?

అనాదిగా దుర్మతములు ప్రబలుటయు, అట్టితఱిని మీవంటివారు వాని నివారణమునకై పాటుపడుచుండుటయు, చరిత్రములవలన నెఱుకపడుచునేయున్నది. శాస్త్రజన్యజ్ఞానములేని జ్ఞానలవదుర్విదగ్ధులు సద్ధర్మసంరక్షణమునకుఁగాఁ బాటుపడువారిని సర్వవిధముల దూషించుటయు, చరిత్రములవలనఁ దెలిసినదియే, అట్టిచో నెవరో మిమ్ము, నిరుపమానపాండితీధురంధరులును, ఆజన్మబ్రహ్మచారులును, అపరపరశురామావతారులునునగు శ్రీప్రౌఢసరస్వతి గారిని శుంఠలని దూఱుచున్నారు, వారిట్లుదూఱుటవలన నేమో ప్రయోజనమున్నదని తలఁచియుందురు. మీరు వారిని మరలదూఱువారుకారని నేనెఱుఁగుదును. మానవజాతిసహజమగు నహంకారమునం జేసి దూఱుదురేమోయని కొంకుచు

న్నాఁడను. అట్లుదూషెదరేని వారు మీ యందారోపింపఁబూనిన శుంఠతయనర్థము కావలసివచ్చును. ఈయంశమును మీరు జగత్పూజ్యులగు శ్రీ ప్రౌఢసరస్వతిగారికిఁగూడఁ దెలుపవేఁడెదను. విద్యావిషయకమగు పూర్వపక్షములకు మాత్రమే మీరుత్తరమునీదగినదిగాని తక్కిన వారితిట్లకు జవాబీనక్కఱలేదు. మీకు విధియగుటచే దుర్మత నిరాసమునం దప్రమత్తులరగుఁడు. వాచాలకులకేవిధమయిన జవాబును నొసంగవలదు. క్రమముగా వారు వారియంతనే లజ్జించి విరమింపగలరు,

సీ॥ శుంఠలతోవాదు శుంఠకేతగుఁగాక
తగునె నీవంటి విద్వత్తమునకు
నీచునితోవాదు నీచునకేగాక
తగునె నీవంటి యుత్తమతమునకు
పలుగులతోవాదు పలుగులకేకాక
తగునయ్య నీవంటి ధార్మికునకు
తులువలతోవాదు తులువకేతగుఁగాక
తగునయ్య నీవంటి తత్త్వనిధికి
తే॥ గీ॥ సూఱుకాకులఁగోయిలతీరుగాఁగ
నున్నదిభవత్ప్రసంగము తిన్ననైన
వారుగ్రహియింపఁగలరు నీసారమెవ్వ
రఱచిననునీకు లెక్కేమి యఱవనిమ్ము॥

సీ॥ వజ్రంబు కాచమై వఱల దెన్నఁటికిని గోపు శ్వానంబుగాఁబోవదెపుడు
అశ్వంబు గాడ్దెగాదాఁబోతు చీఁబోతుగాదు సముద్రంబు కొల్వగాదు
వ్యాళంబుగాదు మార్జాలంబు ఖద్యోతుఁడిలను ఖద్యోతుఁడెయ్యెడను గాదు
ఒరసుపతివ్రత బానిసతొత్తుగాదార్యుఁడుగాఁబోఁడల్పజనుఁడు
తే॥ గీ॥ పరమమూర్ఖులు ప్రకటించు పాడు ప్రకట
నములు పనిసేయవెపుడు నుత్తములు

శ్రీయు శ్రీతలేనిల్చు నలబ్రహ్మ
శ్రీతలగుచు నన్నుతవల్లీవిరామ పట్టాభిరామ॥
(హితబోధకుఁడు)

☞ షరా:—వృథాదూషకులకు జవాబీబడదు. ఇచ్చినను ప్రాజ్ఞులు సైఁపరు. ప॥ అ॥

## భక్తిః

శ్లో॥ లబ్ధ్వా సుదుర్లభమిదం బహుసంభవాంతే
మానుష్య మర్థద మనిత్యమపీహ ధీరః
తూర్ణం యతేత నపతే దనుమృత్యుయావత్
నిశ్శ్రేయసాయ విషయఃఖలు సర్వతస్స్యాత్

శ్రీమదనవద్యవిద్యాభాసురులగు పారాశరులవారుపనిషత్కుసుమసూత్రంబులగు సూత్రంబులను సంగ్రధితపురాణంబులగు నష్టాదశపురాణంబులను బహువిధధర్మవికాసంబులగు నితిహాసంబులనునిర్మించి తన మతియను మంధానమహీధరముచే వేదపారావారంబును మథించి భారతమనునమృతంబును సకలబుధజనంబులకుసమర్పించియు నజ్ఞాతహేతుకమగు మనస్తాపమునఁ గ్రుంగుచు శ్రీసరస్వతీతీరంబున నివసించి శ్లో॥ ప్రాయేణతీర్థాపగమాపదేశా త్స్వయంహితీర్థాని పునంతిసంతః॥ అను ప్రమాణముచే నాతీర్థమును బావనము చేయుటకు నచటికిదయచేసిన నిగమాంతవిద్యావిశారదులగు నారదులవలన స్వమనస్తాపహేతువగు భగవద్గుణానభివర్ణనం దెలిసికొని తత్తాపోపశమనార్థమై భగవద్గుణాంబుధియందు విహరింపఁదలఁచి శ్రీమద్భాగవతమునునిర్మించి కృతకృత్యులయిరను నీవార్త సర్వసజ్జనసంవాదిని-అట్టిభాగవతము

శ్లో॥ రాజన్తేయావదన్యాని పురాణాని సతాంగణే
యావన్నదృశ్యతేసాక్షా చ్ఛ్రీమద్భాగవతం పరం॥

అనుప్రమాణముచే సర్వపురాణోత్తమమును గాయత్ర్యర్థోపబృంహకమును గావున, ఆస్తికజనుల కందఱికి మిక్కిలి ప్రమాణమైయున్నది. అందలి పైనుదహరింపఁబడిన శ్లోకముయొక్క యర్థము "ప్రాణులు స్వకృతసుకృతపరిపాకవశమునఁ గ్రిమికీటపశుపక్ష్యాదినానావిధయోనులయందుఁబుట్టుచుఁ జచ్చుచుబహువిధసంసారతాపములఁబొందుచు దైవానుగ్రహమువలన బహుకాలమున కీదుర్లభమగు మనుష్యదేహమునొంది నిత్యసన్నిహితమృత్యుకమగునీశరీరము కాలగ్రస్తము కాకమున్నె సంసారసాగరతరణరూపమగుమోక్షముయొక్క ప్రాప్తికయి ప్రయత్నించుట చాలమంచి"దని నిద్రాహారమైథునాదివిషయసుఖంబులు శ్వసూకరాదిజన్మలయందును సులభమే, కావున నట్టితుచ్ఛసుఖములకయి యీజన్మమును వ్యర్థముచేయుట మందమతులయొక్క మతిపరిపాకముగాని వేఱొండుకాదు- ఈపరమపురుషార్థమగు మోక్షము "తమేవంవిదిత్వాతిమృత్యుమేతి, తరతిశోకమాత్మవిత్" ఈమొదలగుశ్రుత్యంతప్రామాణ్యములచే నాత్మజ్ఞానాధీనమైయున్నయది ఈఆత్మజ్ఞానము "తమేతం వేదానువచనేన బ్రాహ్మణావివిధిషంతి,యజ్ఞేన దానే నతపసా నాసకేన"అనుశ్రుతిప్రమాణములచే వేదయజ్ఞదానతపోధీనమయి యుండుట స్పష్టమయినను శ్లో॥ నాహంవేదైర్న తపసా నదానేన నచేజ్యయా శక్యఏవంవిధోద్రష్టుం దృష్టవానసిమాయథా॥ భక్త్యాత్వనన్యయాశక్య అహమేవంవిధోర్జున। జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప॥ ఈమొదలగుభగవద్గీతాప్రమాణ్యములచే భగవద్భక్త్యధీనమైయున్నది. శ్రుతిస్మృతులలో శ్రుతి ప్రబలముగాన భక్తిసాధనవాదము దుర్బలమనితలఁపఁగూడదు. "వేదైశ్చసర్వైరహమేవవేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహం" అనుగీతావచనముచేఁ గృష్ణభగవానులు సర్వవేదప్రతిపాద్యులును సర్వవేదాంతవేత్తలును నగుచున్నవారు, కావునఁ దన్ముఖకమలనిర్గతమకరందరసాయమానమగు నీగీతామృతము మోక్షముకంటెఁ గొంచె మెక్కువైనయది.

శ్లో॥ మలనిర్మోచనంపుంసాం జలస్నానందినేదినే సకృద్గీతాంభసిస్నానం సంసారమలమోచనం॥ గీతాజ్ఞానముపాశ్రిత్య మమసాధర్మ్యమాగతాః॥ గీతేత్యుచ్చారసంయుక్తో మద్భక్తింలభతేపరాం॥ అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ మంబ త్వామనుసందధామి భగవద్గీతే భగవద్ద్వేషిణీం॥ ఈమొదలగుశ్లోకములయందు గీతామహాత్మ్యము విశదముచేయఁబడియున్నది. కావున మోక్షము భక్తిజన్యజ్ఞానాధీనమైయున్నది. కనుకనే భక్తి మనుష్యున కత్యావశ్యకము ఇది శంకరాచార్యప్రభృతులమతము. కృష్ణభగవానులు "మోక్షమునకు భక్తియే యంతరంగసాధన" మని వక్కాణించియున్నవారు శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాంనమస్కురు మామేవైష్యసియుక్త్వైవ మాత్మానం మత్పరాయణాః" అనుగీతావాక్యమం దీయర్థముస్పష్టము. మఱియు "మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతఃపరస్పరం కథయంతశ్చమాంనిత్యం తుష్యంతిచరమంతిచ॥ తేషాంసతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం దదామిబుద్ధియోగంతం యేనమాముపయాంతి తే॥ అనుశ్లోకములయందు "భక్తులకాత్మజ్ఞానముకూడ భగవంతుఁడేయిచ్చు" నని చెప్పఁబడియున్నయది. కావున నిశ్శ్రేయసాభిలాషులగుప్రాణులకు భక్తి యావశ్యకమైయున్నది. ఈభక్తికిఁ బ్రధానాంగమగు భగవద్గుణానువాదమునకు విముఖులగునరులను శ్రీవ్యాసులవారు శ్లో॥ నివృత్తతర్షైరుపగీయమానా ద్భవౌషధా చ్ఛ్రోత్రమనోభిరామాత్ క ఉత్తమశ్లోకగుణానువాదా త్పుమాన్ విరజ్యేత వినా పశుఘ్నాత్॥ అనుశ్లోకమున నిందించియున్నవారు ఈభక్తికి మఱియొకయంగమగుభగవన్నామపఠనముయొక్కమాహాత్మ్యముం జెప్పుటకు బ్రహ్మాదులకైనను నలవిగాదు.

తే॥ అరయఁబుత్రోపచారితమైనవిష్ణు
నామమవసానకాలంబుననుభజించి
శార్ఙ్గినిలయంబుఁ జేరె నజామిళుండు॥

అని భాగవతమున "నజామిళుఁడనుదాసీకాముకుఁడు నారాయణనా

మోచ్చరణమాత్రముచే ముక్తుఁడయ్యె" ననిచెప్పఁబడియున్నది. పాండవగీతలయందును శ్లో॥ నారాయణో నామనరో నరాణాం ప్రసహ్యాచోరః కథితః పృథివ్యాం। అనేకజన్మార్జితపాపసంచయం హరత్యశేషం స్మృతిమాత్రఏవ॥ అనియు "సకృదుచ్చారితం యేన హరిరిత్యక్షరద్వయం। బద్ధఃపరికరస్తేన మోక్షాయగమనం ప్రతి" అనియుఁ జెప్పఁబడియున్నయది. స్వానుస్మరణమాత్రకృతనిఖిలసాత్వతజనాహ్లాదుఁడగు ప్రహ్లాదుఁడు శ్లో॥ యస్మాత్ప్రియాప్రియవియోగసుయోగజన్మ శోకాగ్నినాసకలయోనిషు దహ్యమానః దుఃఖౌషధం తదపిదుఃఖ మతద్ధియాహం భూమన్భ్రమామి వదమేతవదాస్యయోగం॥ అని భగవద్భక్తియోగమునే ప్రార్థించియున్నవాఁడు. ఈప్రహ్లాదులవారే శ్లో॥ నహ్యచ్యుతంప్రీణయతో బహ్వాయాసోసురాత్మజాః। ఆత్మత్వాత్సర్వభూతానాం సిద్ధత్వాదిహసర్వతః॥ అని "భక్తి బహుసులభమైన" దని వక్కాణించియున్నవారు. భగవంతుఁడు సర్వప్రాణుల యంతరాత్మయైయుండి యీప్రాణులయొక్క మన ఇంద్రియవ్యాపారముల నిర్వర్తింపుచు నీప్రాణులకుఁ బరమసుహృత్తైయున్నవాఁడు. ఈభగవదుపకారమును బ్రాణులెఱుఁగరు. ప్రజాపతియగు దక్షుఁడివిషయమై హంసగుహ్యస్తోత్రమందు ఆ॥ ఎల్లతనువులందు నిరవొంది తనతోడ। బొందు సేసినట్టిపొందు కాని। పొందువొందలేఁడు పురుషుండు, అనివక్కాణించియున్నవాఁడు. కావున నిట్టినిర్వ్యాజకరుణాపూర్ణుఁడును బరమోపకారియు నగుభగవంతుని భక్తిరూపమగు ప్రత్యుపకారవిధి మనకవశ్యకర్తవ్యమైయున్నయది. ఈవిధియందుఁ బ్రాణులకు సుఖాధిక్యమే కాని యాయాస మెంతమాత్రమును లేదు. కేవలభక్తుఁడగుపురుషుఁడు సత్యశౌచాదిద్వాదశగుణములుగలపురుషునికంటెఁ జాల శ్రేష్ఠుఁడు. ఈవిషయమై భాగవతమునందే

మ॥ అమలజ్ఞానసుదానధర్మరతిసత్యక్షాంతినిర్మత్సర
త్వములన్ యజ్ఞతపోనసూయలఁగడున్ దర్పించుధాత్రీసురో

త్త్వము కంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోర్థప్రాణవాక్కర్మముల్
సమర్థన్ నిన్ను నయించె నేని నిజవంశ శ్రీకరుండౌఁదుదిన్ ॥

అనుపద్యము కలదు.

ఇట్టిభక్తితో సమానమైన సమార్గ మేదియు లేదనియు నిది సత్సంగలభ్య మనియు భాగవతమున శ్లో॥ నయుజ్యమానయా భక్త్యా భగవత్యఖిలాత్మని। సదృశోస్తి శివః పంథా యోగినాం బ్రహ్మసిద్ధయే॥ అసంగమజరం పాశ మాత్మనః కవయో విదుః। సఏవ సాధుషు కృతో మోక్షద్వారమపావృతం అను శ్లోకములచేఁ జెప్పఁబడియున్నదిగాన భక్తికాముకులకు భాగవత సేవ యావశ్యకము. ఈభక్తి సగుణమనియు నిర్గుణమనియు ద్వివిధమై యున్నది. అం దర్చావిగ్రహార్చనాదికము సగుణము. మనస్సున భగవత్స్వరూపము శంఖచక్రగదాధరత్వాదిగుణోపేతముగాఁ గల్పించుకొని ధ్యానించుట నిర్గుణము. ఈవిషయము భాగవతమునఁ గపిలదేవహూతిసంవాదమందు స్పష్టము. ఆశ్లోకముల విస్తరభయముచే నిట నుదహరింపలేదు ఈసగుణభక్తి సాత్విక రాజస తామస భేదములచేఁ ద్రివిధమైయున్నయది. అందు ఫలాపేక్షవినా భగవదర్పణబుద్ధిచేఁ బ్రాచీనకర్మక్షయార్థ మొనరించు భగవదర్చనరూపమగు సాత్వికభక్తి నిర్గుణభక్త్యంగము. యశఐశ్వర్యాదులకై చేయు రాజసభక్తియు హింసాదంభాదులకై చేయు తామసభక్తియు నిర్గుణభక్తిని గలుగఁజేయఁజాలవు. శ్లో॥ అర్చాదావర్చయేత్తావ దీశ్వరం మాం స్వకర్మకృత్ యావన్న వేద స్వహృది సర్వభూతేష్వవస్థితం॥ అను ప్రమాణముచే భగవంతుఁడు హృదయమునఁ గలఁడను జ్ఞానము గలుగునంతవఱకు సాత్వికభక్తి యావశ్యకముగాన నో ముముక్షువులారా! వైష్ణవపురోడాశమును శునకాధీనము చేయుభంగి నిశ్శ్రేయసార్థమగు మనుష్యజన్మమును విషయోపభోగార్థము చేయక యావన్మరణము భగవద్భక్తియందు మన ఇంద్రియాదుల బ్రవర్తింపఁ జేయుఁడు. భాగవతోత్తములగు కులశేఖరులవారు శ్లో॥ జిహ్వే! కీర్తయ కేశవం, మురరిపుం చేతో! భజ, శ్రీధరం పాణిద్వంద్వ! సమర్చయా, అచ్యుతకథాం శ్రోత్ర

ద్వయ! త్వాం శ్రుణు॥ కృష్ణం లోకయ లోచనద్వయ! హరే ర్గచ్ఛాంఘ్రి యు
గ్మాలయం, జిఘ్ర ఘ్రాణ! ముకుందపాదతులసీం, మూర్ధ! నమాధోక్షజం
అని సెలవిచ్చినవిధమున సాత్వికభక్తియందుఁ బ్రవర్తించి తదనంతరము
చిత్తశుద్ధికలుగుటయు భగవద్దత్తమగు జ్ఞానయోగ మవలంబించి

చ॥ అనిశము సర్వభూతహృదయాంబుజవర్తియనందనర్చు నీ
శునను నవజ్ఞసేసి మనుజుండొగి మృత్ప్రతిమార్చనావిడం
బనమున మూఢుఁడై యుచితభక్తిని నన్ను భజింపఁడేని
నమ్మనుజుఁడు భస్మకుండమున హూనకి వేల్చినయట్టివాఁడగున్॥

అనుప్రమాణముచే నర్చారాధనవదలి హృదయమున శ్లో॥ సంచింత
యే ద్భగవత శ్చరణారవిందం వజ్రాంకుశధ్వజసరోరుహలాంఛనాఢ్యం
ఉత్తుంగరక్తవిలసన్నఖచక్రవాళజ్యోత్స్నాభిరాహతమహద్ధృదయాంధ
కారం॥ ఈ మొదలగువిధమున భగవత్పాదారవిందధ్యానముం జేయుచుఁ
గ్రమముగా జ్ఞానసిద్ధులై శ్లో॥ దేహంచ నశ్వర మవస్థిత ముత్థితం వా సి
ద్ధోనపశ్యతి యతోధ్యగమత్స్వరూపం। దైవాదుపేత మథ దైవవశాద
పేతం వాసోయథాపరిహృతం మదిరామదాంధః॥ అను భాగవతశ్లోకా
ర్థమునకువిషయులరై ముక్తులుగందురు. ఏతద్ధ్యానాసమర్థులైనచో శ్లో॥
అశేషసంక్లేశశమం విధత్తే గుణానువాదశ్రవణం మురారేః॥ అనున్యాయ
మున భగవత్కథాసుధాసాగరతరంగడోలికలపై సుఖంబుగఁ గ్రీడిం
చుఁడు. ఇంతకన్న నిర్దుఃఖమగుసుఖముదొరకుసాధనము నెచ్చటంగనఁ
బడదు. శ్లో॥ యన్మైథునాదిగృహమేధిసుఖం హి తుచ్ఛం కండూయనే
నకరయోరివ దుఃఖదుఃఖం॥ అని విషయసుఖముయావత్తును విషసం
పృక్తాన్నమువలె దుఃఖసమ్మిళితమైనయది. శ్లో॥ జాయమానం హి పురుషం
యంపశ్యే న్మధుసూదనః। సవై తత్త్వార్థవిజ్ఞాతా సవై మోక్షార్థచింతకః॥
అనుప్రమాణముచేఁ బ్రాణులకు మోక్షచింతగలుగుటయును భగవద్ద
యాధీనమయియేయున్నది గావున నిఖిలజగదుదయవిభవలయలీలుఁడ
గురమాంగోలుని నిర్హేతుకమగుకృపాకటాక్షము మనయావజ్జనముపైఁ
బడఁగలందులకు భగవంతునినిరంతరము వినుతించివిరమింపఁబడుచున్నది.



# శివానందలహరి



శ్లో॥ కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే
శివాభ్యా మస్తోకత్రిభువనశివాభ్యాం హృదిపున
ర్భవాభ్యా మానందస్ఫురదనుభవాభ్యాం నతిరియం

శా॥ శ్రీమత్సర్వకలామయుల్ శశికలాశృంగారితోద్యచ్ఛిఖుల్
ధీమద్భక్తఫలప్రదుల్ నిజతపస్తీక్ష్ణత్వసమ్యక్ఫలుల్
ప్రేమప్రాపితసర్వలోకకుశలుల్ ప్రీతిస్ఫురద్బోధు లా
ర్యామృత్యుంజయు లీ నతింగొనుత మద్ధ్యానప్రభూతాంగులై 1

శ్లో॥ గళంతీ శంభో! త్వచ్చరితసరితః కిల్బిషరజో
దళంతీ ధీకుల్యాసరణిషుపతంతీ విజయతాం
దిశంతీ సంసారభ్రమణపరితాపోపశమనం
వసంతీ మచ్చేతోహ్రదభువి శివానందలహరీ

శా॥ శ్రీశంకర! త్వచ్చరిత్రలహరీకాసారనిర్యాతమై
ఘోరాఘౌఘపరాగభంగకరమై క్రూరోగ్రసంసారవి
స్ఫారోగ్రాపహమై మదచ్ఛధిషణాఖ్యహ్రదాసన్నసం
చారంబై రహిమించుఁగావుత శివానందప్రవాహం బిలన్ 2

శ్లో॥ త్రయీవేద్యం హృద్యం త్రిపురహర మాద్యంత్రిణయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరం
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదానందం సాంబం శివ మతివిడంబం హృదిభజే

చ॥ నిగమపువేద్యు హృద్యుఁ బురనిర్మథనుం బ్రథముం ద్రినేత్రు నా
ర్యగురు జటాధరున్ ఫణివరాంగదు నేణధరున్ మహేశ్వరున్
జగదధినాథుఁ జిత్కళుఁ బ్రశస్తు సదా గిరిజాసమాహితున్
దగభజియింతుఁ జిత్తమున నం గృపనేలుశివాఖ్యదేవతన్ 3

శ్లో॥ సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదాః
న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలం
హరిబ్రహ్మాదీనామపి నికటభాజా మసులభం
చిరంయాచే శంభో! శివ! తవ పదాంభోజభజనం

చ॥ భువనములోన నల్పఫలముల్ సమకూర్చుచునుండియున్న యా
సవనభుజుల్ సహస్రములు, స్వప్నములోపల నేని వారి సం
స్తవ మొనరింపఁబో నభవ! దాపుననుండెడి శౌరిసీరరు
డ్భవులకునైనఁ జొప్పడని భవ్యభవత్పదసేవ వేడెదన్ 4.

శ్లో॥ స్మృతౌ శాస్త్రే వైద్యే శకునకవితాగానఫణితౌ
పురాణే మంత్రేవా స్తుతినటనహాస్యే ష్వచతురః
కథంరాజ్ఞాంప్రీతి ర్భవతి మయి కోహం పశుపతే!
పశుం మాం సర్వజ్ఞ! ప్రథితకృపయా పాలయవిభో!

ఉ॥ ధర్మము తర్కవైద్యకవితాస్మృతి జ్యోతిషగానమంత్రవా
క్కర్మలగ్రంథహాస్యములు నేనెఱుఁగన్,ధరణీశు లెట్లు నా
మర్మమెఱింగి ప్రోచెద రుమాధవ! నేఁ బశుసన్నిభుండ ని
వర్మిలి సర్వముం దెలిసినట్టిదయాబ్ధివి కాన నేలుమా 5

శ్లో॥ ఘటోవా మృత్పిండో ప్యణురపిచ ధూమోగ్ని రచలః
పటోవా తంతుర్వా పరిహరతికిం ఘోరశమనం
వృథాకంఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభో ర్భజ, పరమసౌఖ్యంవ్రజ, సుధీః

ఉ॥ భాండశరావధూమశుచిపర్వతరాడణులంచు సారె కు
ద్దండతఁ దర్కముం జదువఁ దప్పునె దారుణకాలపాశ ఘో

పండితసత్తమా! విఫలవాక్కులనెందుకుఁగంరశోష, య
య్యండజరాజభూషు చరణాబ్జయుగార్చన మోక్షమొంద మిా 6

శ్లో॥ మనస్తే పాదాబ్జే నివసతు వచ స్తోత్రఫణితౌ
కరశ్చాభ్యర్చాయాం శ్రుతిరపి కథాకర్ణనవిధౌ
తవధ్యానేబుద్ధి ర్నయనయుగళం మూర్తివిభవే
పరగ్రంథాన్ కైర్వా పరమశివ! జానే పరమితః

ఉ॥ ఉల్లము తావకీయపదయుగ్మమునందు నుతుల్ స్తవంబునం
దుల్లసదాత్మహస్తయుగి యుజ్జ్వలపూజలఁ గర్ణముల్ భవ
త్సల్లలితోక్తిధాళి మతి ధ్యానమునందును రూపునం గనుల్
మెల్లఁగనుంచినాఁడ, నిఁకమిాఁద నెటుల్ పరియింతు నన్యముల్ 7

శ్లో॥ యథాబుద్ధిశ్శుక్తౌ రజతమితి కాచాశ్మనిమణిః
జలేపైష్టేక్షీరం భవతి మృగతృష్ణాసుసలిలం
తథా దేవభ్రాంత్యా భజతి భవదన్యం జడజనః
మహాదేవేశ! త్వాం మనసిచ నమత్వా పశుపతే!

మ॥ భ్రమభావింతురు పైష్టనీరమును క్షీరంబుగాను, గాచోపలం
బు మహారత్నముగా, మరీచికల నంబుల్గాఁగనున్, శుక్తి రూ
ప్యమటం,చట్లు త్వదన్యదేవతల దేవళ్లంచుభావింత్రు మూ
ఢమనీషుల్ నినుఁగాంచలేకమదిలో గంగావతంసా!భుజఙ్ 8

శ్లో॥ గభీరేకాసారే విశతివిజనే ఘోరవిపినే
విశాలేశైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకంచేతస్సరసిజ ముమానాథ! భవతే
సుఖేనావస్థాతుం జనఇహ నజానాతి కిమహో!

మ॥ అసమాగాధసరస్సులన్ విజనఘోరారణ్యవాటిన్ వహిం
ద్రసమూహంబుల రోసెడిం జనముమూర్ఖప్రజ్ఞఁ బుష్పార్థమై
వెసనాత్మీయమనస్సరోజమొకదున్ వేడ్కన్ సమర్పించినీ
కసులన్ సౌఖ్యము పెట్టనేరఁ డరరే! యాంర్యామనోవల్లభా! 9

శ్లో॥ నరత్వం దేవత్వం నగవనమృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతువిహగత్వాదిజననం
సదా త్వత్పాదాబ్జస్మరణపరమానందలహరీ
విహారాసక్తంచే ద్ధృదయమిహ కింతేన వపుషా

చ॥ అమరనరాగకాననమృగాండజగోమశకద్విరేఫకో
త్తమజననంబుగల్గినను త్వచ్చరణస్మరణప్రహర్షభా
గ్యము సమకూరెనేనిమది కాయపకృష్టశరీరసంగత
శ్రమమున నెంతపాటిదగు స్వాంతమునన్ వివరించిచూచినన్ 10

శ్లో॥ వటుర్వా గేహీవా యతిరపి జటీవా తదితరో
నరోవా యఃకశ్చిద్భవతు భవ!కింతేన భవతి
యదీయం హృత్పద్మం యదిభవదధీనం పశుపతే!
తదీయస్త్వం శంభో!భవసి భవభారంచ వహసి

ఉ॥ ఎవ్వనిచిత్తవారిజము నింపుగ యుష్మదధీనమౌను వాఁ
డెవ్వసుధం గృహస్థయిననేమి యతీశ్వరుఁడైననేమియౌ
నవ్వల నాలుగాశ్రమములందు నెవండయినం జగంబునన్
నివ్వెఱఁగంద వానిఁ గరుణించి యధీశుఁడవౌదు వీశ్వరా! 11

శ్లో॥ గుహాయాం గేహేవా బహిరపి వనేవా ద్రిశిఖరే
జలేవా వహ్నౌవా వసతు వసతేః కింవద ఫలం
సదా యస్యైవాంతఃకరణమపి శంభో!తవపదే
స్థితంచే ద్యోగోసౌ సచ పరమయోగీ సచసుఖీ

ఉ॥ కందరమందిరాగ్నిగిరికాననవారులయందు నెందునే
నుందురుగాక, దాన ఫలముండునె? నీపదవారిజంబులన్
డెందమునందు నిల్పికొని రేవివసింపుచునుండువాఁడె యా
నందయుతుండు యోగియు ననందగువాఁడు మహిన్ మహేశ్వరా! 12

ఉ॥ ఏగిరియందునీవువసియింతువొ లీలలుచూపుచుందువో
యాగిరి పల్లెయైన జను లందుఱు తిర్పతియంచు, దానితో
యోగమెకాని యేటికి వియోగమునీకు ఘటించు,వీడినన్
భోగములేదునీకనుట మూర్ఖత తిర్పతివేంకటేశ్వరా! 25

చ॥ గురువగునిన్నుఁ గావచుచుఁగూయుటయే యొకతప్పు, దానిపై
గురువునుబల్కరానిపలుకుల్ పలికించుటిఁకొక్కతప్పు, దు
స్తరమగుపాప మిప్పగిది సారెకుఁ జేసెడివారికోసమే
నరకము క్రొత్త దేర్పఱచినాఁడవు తిర్పతీ॥ 26

చ॥ ఎవఁడుదశావతారములనెత్తెను వాఁడవునీవ, త్వత్కలా
భవులనికాదె వ్యాసుఁడు ప్రబంధములం దల రామకృష్ణపుం
గవులనుతించు, టీవు నొకకంటనుగన్గొనుచుంట, వీరి కా
భవనమునం బ్రతిష్ఠకనుపట్టుట తిర్పతి॥ 27

ఉ॥ దేవుఁడవంచునీకు వినుతిం బ్రణతిం బచరించువారెపో
కోవిదు, లట్టికోవిదులకోసమె నీవిభవంబు సర్వమున్
గావలెనంచుఁగోరుదువుకాని కటా తెగనాడఁజూతు వే
కావలువైనవార లదిగానరు తిర్పతి॥ 28

ఉ॥ రాజతరాజరాజనగరంబు లనేకములందుఁజెందితీ
వ్రాజమెయింబ్రతిష్ఠ,యదియుండఁగ నిమ్ముఱుమొన్న పొంది తీ
రాజమహేంద్రిమందిరవరమ్ముల మిన్నగు వీరికాపురీ
రాజమహేంద్రిమందిరవరంబువఁ దిర్పతి॥ 29

ఉ॥ ఎల్లరు నీవ యాదిపతి వీత్రిజగంబులకంచు నిన్ను వే
నోళ్లనుతింపుచుండఁగ జనుల్ మఱికొందఱు నీకుస్తోత్రమే
చెల్లదటంచు నిన్ను నిరసింపఁగసాగిరి స్వామి! యేమియీ
యల్లరి, పెట్టవీవుచెవి నైనను దిర్పతి॥ 30

ఉ॥ కర్ణమునందుఁబెట్టవని కాదుసుమీ వచియించుటింతగాఁ
బూర్ణముగాఁగసంచితవిమఱి న్నదిచాలకయుష్ణ తిగ్గి హ్వా

కీర్ణతనొందుచుండిగి నికృష్టులు వారలుతృప్తిలేక వి
ద్యార్ణవతృప్తిసేయఁదగఁడా యిఁకఁ దిర్పతి॥ 31

ఉ॥ సేమముగోరి తిర్పతివసించి ప్రసన్నతఁదాల్చి సేవక
స్తోమసురద్రుమంబవగుచున్ విలసిల్లెడినిన్ను రామరా
మా! మహిసేరొ దూఱుదురఁ టంతటిమాత్రన నీదుపిక్కపై
రోమముగూడఁబోదని యెఱుంగుము తిర్పతి॥ 32

ఉ॥ కింకరులై భవత్స్తవ మొగింబచరించెడి భక్తకోటి కే
కొంకునుజంకులేని కలుకుందన మొక్కఁడొసంగి వైరిఘా
టంకవతీమనోహరనిటాలతటాలకకుంకుమప్రభా
పంకముఁ బాపుశక్తినిడువాఁడవు తిర్పతి॥ 33

ఉ॥ పంబిన వేడ్కనిన్ గొలుచు పార్థివులజ్ఞులటంచు, నీకు న
ర్థంబులొసంగువార లపథంబునఁబోయెడివారలంచు నై
చ్యంబుఘటింతురీ పాలకునియందునఁగొందఱు తిన్నయింటివా
సంబులు లెక్కపెట్టుసరసంబిది తిర్పతివేంకటేశ్వరా! 34

ఉ॥ ఆదటగల్గినిన్నుభవదంశసముద్భవులైన రామకృ
ష్ణాదుల కెందునైన జగమందున ముందు సపర్యచేసి యీ
మీఁదను నీవులేవనఁగ మేకొనుదుర్మతులుండ రున్నచో
మోదరెయోగ్యులెల్లఁ బనిముట్టునఁ దిర్పతి॥

ఉ॥ వందలువేలుపద్యము లవారిగ నిం బడఁదిట్టుచుం గటా
క్షిందునుమీఁదుగానక లిఖింతురుపత్రికలందుఁగొంద ఱీ
చందముఁజూడ వారిది దొసంగనితోఁచదు వాఁడికట్టిశ
క్తిందయసేసినట్టి తమదేయది తిర్పతి॥ 36

ఉ॥ దాసులుసేసినట్టి పలుతప్పులునైనసహింతువంచుఁ జే
రోస్మసినవాఁడనీవనుచు మోఱకులేగతి నిన్నుదూఱినన్
దోసముఁజెందకుండుట విరుద్ధమటంచెవరేమియన్న నీ
చేసెడుకార్య మేమఱఁగఁజెల్లదు తిర్పతి॥ 37

చ॥ శరణము నీమనోహరయశస్సరసీరుహవైరిమూర్తికిన్
శరణము నీమనోహరశుభచ్ఛవిదంతురమూర్తికిన్ నమ
స్కరణము నీపదాంబుజయుగంబునకుం గయిమోడ్చుచుం బుర
స్కరణము నీదుభక్తులకొసంగెదఁ దిర్పతి॥ 38

ఉ॥ మంగళమయ్య నీదుమహిమంబునకా యలమేలుమంగకున్
మంగళమయ్య నీవు కడుమాన్యతగూర్చినయెమ్మెలాడికిన్
మంగళమయ్య నీగుడికి మంగళమయ్య భవద్భటాళికిన్
మంగళమయ్య నీకొకనమస్కృతి తిర్పతి॥ 39

ఉ॥ సేమమునీకు నీయనుఁగు శిష్యులకుం గుశలంబు నీదువి
ద్యామహనీయపద్ధతి కనామయ మూర్జితసర్వదిక్తట
స్తోమనిరంకుశప్రబలసుందరకీర్తిలతానతాంగికిన్
సేమమునీదుభక్తులకు సేమము తిర్పతి॥ 40

ఉ॥ పాలకుఁడాత్మకూరునరపాలుఁడు గ్రంథముల్ వ్రాయఁజేసి యే
వేళను నీదునామముజపించుచు నిన్నుసదా భజించుచున్
గాలము వెళ్ళఁబుచ్చుచు సుఖంబుగ భోగములందుచుండె ని
న్నోలిభజింప లోపమొకటుండునె తిర్పతి॥ 41

ఉ॥ ఈవొకరాతిబొమ్మవని యెంతురు కాని నిజంబుగా మదిన్
భావనసేయుచో బయటపత్తువు దివ్యదఖండవైభవ
శ్రీవిజయస్వరూపమును జేకొని మున్నొకపండితుండనిన్
§ దీవరపెట్టఁగాఁ దలుపుదీయవె తిర్పతి॥ 42

ఉ॥ నీప్రతిబింబచిత్రము లనేకములుండనియిండ్లు లేవు నీ
సుప్రథితప్రబంధములుచూడనియోగ్యులు లేరు వేల్పులన్
బ్రప్రథమంబు నీచరణపద్ధతికిం దలయీనివారు లే
రప్రతిమప్రభావ! జగమందునఁ దిర్పతి॥ 43

---

§శ్లో॥ ఐశ్వర్యమదమత్తోసి మాం న జానాసి దుర్మతే! పరైః పరిభవే ప్రాప్తే
మ ధీనా తవస్థితిః॥

ఉ॥ పూచినమావిగున్నగతిఁ బొల్చెడి నీఘనవజ్రకంచుకన్
శ్రీ చెలువారు విగ్రహము చెల్వుగనుంగొనలేక నోటికిన్
దోఁచినయట్లు ప్రేలెదురు ధూర్తులు వారలపాపమేమొ సం
కోచము లేక చెప్ప వినఁగోరెదఁ దిర్పతి॥ 44

ఉ॥ చిత్రములందు శిల్పులు రచించిన బొమ్మలు తల్లిదండ్రులున్
బుత్రులు మిత్రులంచుఁ దలపోసెదు నిప్పటివారు దివ్యనా
రిత్రుని దేవు విగ్రహము రీతిగ భావన సేయ లేరఁటే
చిత్రము వింటివే మిగులఁ జిత్రము తిర్పతి॥ 45

ఉ॥ రాజుల విగ్రహంబు గజరాజులపైనిడి యుత్సవంబులున్
బూజలు సేయు నిప్పటిజనుల్ గుడిలోఁగల వేల్పుబొమ్మకున్
బూజయొనర్ప రాదనుట పోలను కావున నెప్పుడేనియున్
బూజలు విగ్రహంబులకుఁ బోలును దిర్పతి॥ 46

ఉ॥ తిట్టెదు నోటికేని నిను "దేవుఁడ! దేవుఁడ!" యన్న తిట్టె గ
న్పట్టును గాని వేఱుగ నుపట్టదు మార్గము కాన నూరకే
వట్టిప్రలాపముల్ పలుకు వారల తిట్లఫలంబు వారినే
కొట్టెడు కాలమీవు కనుగొందువు తిర్పతి॥ 47

ఉ॥ ఎప్పటినుండియో భువి వహించుచునుంటివి కీర్తి, యొండలో
కప్పము నిచ్చువార లధికంబుగఁ బావకనామధారులై
యెప్పుడివారలెందఱో, యహాహా! యెటువంటివి నీయశఃప్రభల్
'పెప్పెపెమెమ్మెమేలు' పెకలింతురె తిర్పతి॥ 48

ఉ॥ ఈవు నిజంబు దేవుఁడవయేని భవన్మహిమంబు సర్వభూ
మీవలయాలయంబులను మేటితనంబు వహించెనేని దు
ర్ధీవశులౌచు నిన్నుఁ జెడఁదిట్టినవారలమీఁదఁ జూపుమో
దేవర! శీవరంబు వెనుదీయక తిర్పతివెంకటేశ్వరా! 49

ఇట్లు
శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి

అ॥ అందు, పాతపాటియమ్మయన్ పేరునఁ
దనరు నొక్క దేవతాలయము
ఇంకనొక్కయూరు నెసఁగుఁబోలేరమ్మ।
యనెడిఖ్యాతమైనయాఖ్యగలిగి 19

సీ॥ బాగుగా వేయంగఁబడినట్టిమోకొండు
లలిని దిరుగఁదగ్గలావుకలిగి
చేకొద్దివిసరినచిన్నిరాతికిఁగూడ
గోచరింపనియట్టి కొనలుగలిగి
దశదిశల్ వ్యాపించి దట్టమైకన్పట్టు
నురుతర శాఖానిర్భరముఁగలిగి
వేజనంబులకేని విశ్రామహేతువై
నీరంధ్రమైనట్టి నీడగలిగి
తే॥ గీ॥ పెక్కు జాతులపులుగులుం బ్రీతినెపుడు
కోరివసియింపఁదగినన్ని గూళ్లుగలిగి
పాతపాటమ్మగుడికిలోపల నొకండు
వెలసియుండె ననాదిగా వేఁపమ్రాను 20

సీ॥ నికటపుం బెదబావి నీటికై తెంచెడి
మానవుల్ నిలుచుంట దీనిక్రింద
సామాన్యజనులెల్ల సందడుల్ సేయుచు
తీరికూర్చుండుట దీనిక్రింద
చుట్టుప్రక్కలయిండ్లశూద్రాదిపశుతతుల్
తిన్నగాఁబడుకొంట దీనిక్రింద
బ్రాహ్మణాదిజనంబు పారలౌకికవిధుల్
తీర్చియేగుచునుంట దీనిక్రింద
తే॥ గీ॥ జాతరల్ నాగునప్పెల్లజనులుగూడి
దేవతం గొల్చుచుండుట దీనిక్రింద

నిన్ని విధముల మాయూరి యెల్లజనుల
కుపకరించుచునీవృక్ష ముండెఁ జిరము 21

మ॥ మదముంగూర్చుచునుండియుండియుటు, పెన్మూలంబుతోఁగూడనా
పెదనింబద్రుమ్ము నేలఁగూలి గుడి నిర్భేదంబుగావించుచున్
బదుగుర్గూడి పౌనర్చఁ జేసిమరలం బ్రాసాదనిర్మాణమున్
మది సంప్రోక్షణకుం బ్రయత్నపరులై మాత్రంబుగావించుచున్ 22

ఉ॥ "ఊరడెను వాఁగునావలను నొండొకదేవత, దానికొల్పులన్
బండికిఁబోవరామిఁ గడుబాధగనున్నది, కాన నూరిలోఁ
గొండొకచోటనిల్పుదము, కోరియయుంటి మొకండుసల్పగన్
కెడవదీప్రతిష్ఠ" యని ప్రీతినెనర్చిరి తత్ప్రయత్నముల్ 23

వ॥ ఇట్లొనర్చుచు

చ॥ "వెనుకటిదేవతాశిలల విగ్రహరూపమె లేకయుండెఁ గా
వున నవవిగ్రహమ్ములకుఁ బోవలె దుర్గ" కటంచుఁ బోయి యా
పనినెఱవేర్చ యాజకుని బ్రాహ్మణుఁ జేయుటకున్ సహింప కొ
క్కని రథకారుఁ దెచ్చుటకుఁగా జతనంబులు సేయుచున్నెడన్ 25

ఉ॥ అప్పని మత్సహోదరునియాత్మకు నిష్టముగాకయున్కిఁ దాఁ
జెప్పిన శత్రుభావమునఁ జేకొనరంచుఁదలంచి చప్పనన్
బప్పసుదర్శనాఖ్యబుధుపాలికి నే.ఁ యుదంతమంతయున్
విప్పివచించి యాబుధుని వేగమువంపఁగవారిమ్రోలకున్ 26

క॥ ఆపండితుండు కరణము
ప్రాపుననున్నట్టి కాపువారినిగని తాఁ
గోపంబురానియటు వివి
ధోపాయములన్ వచించె "నుడుగుం" డనుచున్ 27

వ॥ ఇదియునుంగాక

చ॥ కరణముగారియింటను నొకానొకరుండుటసంభవించి యా
పురుషుఁ "డిసీ" యనం బెదరి పూనికమానికొనంగనయ్యె, నే

నరునకుఁగూడ నింద్యమయి న్యాయము దప్పినయట్టి కార్య మా
సరసున కెట్టు నిష్టమగు, సభ్యుఁడతండు, యథార్థవాదియున్ 29

ఉ॥ తంగెడ రామకృష్ణకవి తత్క్షణ మప్పనినుండి వారి ని
ర్భంగి మరల్చి చెప్పిచనె "వర్తిలు నొక్కరుఁ డల్ల తొండపిన్
లైంగుఁడు బ్రాహ్మణుండును గలావిదుఁ డాగమవేత్త" యంచు, నా
సంగతి విన్న మీఁద నటు సల్పిరి తోడ్కొనిరా ప్రయత్నముల్ 30

ఉ॥ అప్పుడు మత్పితృవ్యునకు నాత్మజుఁడైన చినప్పయాఖ్యతోఁ
జెప్పి సహాయుఁగాఁగఁగొని శీఘ్రము తొండపి కేగి యాద్విజున్
గొప్పగఁ దోడి తెచ్చుటయు నూతన విగ్రహసంస్థ యాబుధుం
డొప్పినరీతిఁ జేసి తమయూరికిఁ దాఁ జనె నొందిసత్కృతుల్ 31

క॥ అంతయు సక్రమముగ నే। సాంతంబుం బొందెఁ గాని చతురుఁడొకండీ
యంతరమున నొనరించెన్ । సుంత యకృత్యంబు, దాని నొప్పెమసినన్

ఉ॥ "బ్రహ్మకులంబు మాది" యను భ్రాంతి వసించెడి స్వర్ణకారుఁ డా
బ్రహ్మము గిన్నెలాన్వయుఁడు పన్నిన ప్రప్రథమంపు గుట్రచే
బ్రాహ్మణయాజనంబునకు భంగము వాటిలకున్కిఁ గ్రూరమా
జిహ్మగమట్లు మర్వకయ చిత్తమునం బగఁబూనియుండఁగన్ 33

చ॥ పిలువఁగనయ్యె నాతని నె విగ్రహఘట్టనమాచరింపఁగన్
"సలిపెద నాకుఁగాఁదగిన సత్కృతియయ్యెడిచో" నటంచు నా
ఖలుఁడు వచించె, "చూచెదము కార్యము సాఁగఁగ సి" మ్మటంచు న
న్నలుగురు పల్కి, రప్డు బహునాయకమాట సెపడొసంగెనన్ 34

ఆ॥ అంతమీఁద నాతఁ "డసుదెంతు నరుదెంతు"
ననుచు నేగి రాక యట్టెయుండ
దూరదృష్టిలేని మోటకులైన మా
వారు మరలఁ బిల్వఁగోరరైరి 35

చ॥ అడిగని పల్కె యాజకుఁ "డహో! యిది యేమిటి, యంత్రయుక్తమౌ
నది మఱి హేమపుంబకి, యయ్యది యేరుహారింత్రో, కాప్రున్

గుదురుగ ఘట్టితంబగుటగూడ నువిగ్రహ"మంచు మాటికిఁ
సదయతఁ జాటెఁగాని యటుసల్పక యేచని రెల్లవారలున్ 36

క॥ అయ్యోడనటు లేగిన బ్రాహ్మయ్యకు దయయుదయమై తనంతటఁదానే
"అయ్యా! బిగియింతమురండయ్యోడ"కనికొన్ని దినములరిగినమీఁదన్

ఉ॥ కాపుఁడుదోడికొంచుఁజని ఘట్టనసేయక యున్నపున్నెఁగల్
లేపెనువిగ్రహంబులను రేకులయున్కి పరీక్ష సేయఁగన్
జూపడవయ్యె యంత్రములు, చూపఁ బయ్యాగ్రహమందుచుండఁగన్
"బొంపఁగఁతీసి"రన్నటుల బ్రహ్మము తేల్చె స్వయుక్తిచాతురిన్ 38

ఆ॥ అందుమీఁద మూర్ఖులైనట్టియునరఖల్
"యాజకుఁడు చినప్పయయును గలిసి
తీసి"రనుచు మిగులఁ దిట్లుసాగించిరి
యచ్చటచట దౌష్ట్యమతిశయిల్ల 39

తే॥ పండితారాధ్యసుతమునం బ్రబలియున్న
యట్టిముదిగొండవంశ మయ్యాజకునది
వీరభద్రయ్యయను పేర వెలయువాఁడు
పెద్దమానిసి యిటువంటిసుద్దియున్నె 40

చ॥ కరణము గ్రామమున్నిభును గాపులు తక్కజనంబు లెందఱో
యరిగిరి దేవుపెండిలికి నందఱు పెత్తనగాండ్రె యూఁటచే
నరిగినవప్పయాఖ్యుఁడును నయ్యయి కార్యభరంబుపూనియున్
దిరిగెను, నాతఁడే యెటులఁదీసెడి? నన్యులుతీయరెట్టులన్? 41

ఆ॥ అరయ గ్రామబాహ్యమందు నాగుడులుంట
ఒకటఁదలుపులున్న నొకట లేవు
ఎవరునున్ హరింపకే యూరకుంటకు
నంత ధర్మకాలమా? గణింప॥ 42

ఉ॥ విగ్రహమున్ బిగింపకయ వేగమ యేగుటయేల తా మొదల్
నిగ్రహముంద్యజించి కడు నేర్పునవచ్చుటయేల క్రమ్మఱన్

విగ్రహ మున్న దున్నటులఁ బెట్టిబిగింపక యెత్తుకులఁ? యీ
వ్యగ్రతచూడ నంతయును బ్రహ్మమయంబ యటంచుఁ దోఁచెడిన్

*చ॥ అతివినయాన్వితంబులగు నాతని మాటలకున్ భ్రమించి మూ
ర్ఖత మహీదేవయుగ్మము నెకమ్మమహాప్రజ తిట్టిపోయఁగన్
మతిరహితోక్తులం గనలమానిరి మామకు లేమనాక, దు
ష్కృత మొనరించియున్నఁ గద చింతిలి రోసము దెచ్చికొంటకున్

§ఉ॥ తిట్టుట మానుమాటయిడ దెబ్బలుగొట్టుట మాను గ్రామమున్
గట్టిన నాఁటనుండియును గ్రమ్మకులస్థుల కుగ్గుపాలతోఁ

---

* అతివినయం ధూర్తలక్షణం

§ (1) డిక్రిని అమలు నెరవేర్చునిమిత్తము మనిషినిపట్టుకోవడమునకు వారంటు. సివిల్ ప్రొసీజరుకోడుయొక్క 332 డో శెక్షను నర్సారావుపేట డిస్ట్రిక్టుమున్సబుకోర్టు ఆన 1900 సంవత్సరపు 26 నవంబరు సివిల్ వ్యాజ్యము.

వాది. యక్కలపిచ్చయ్య సా॥ గుండ్లపల్లి, ప్రతివాది. పున్నంచంద్రయ్య సా॥ జానపాడు, ...... ఆన 1901 సంవత్సరం ది 10 నవంబరు తేదీన పగలు 8 గంటలకు జానపాడు గ్రామములో ప్రతివాది కరణం యింట్లోయుండగా వాది కనుపర్చినాడు. నేను సదరు ప్రతివాదిని పట్టుకున్నాను పట్టుకోవడముతో నామీదతిరుగబడి తనచేతిలోయున్న కర్రతో కొట్టవచ్చినాడు. నేను కొట్టవచ్చినకర్రనుపట్టుకున్నాను. ఆకర్రనువదిలి నెట్టి నన్ను నెట్టి వుడాయించి పరిగెత్తినాడు. అప్పట్లో గ్రామమునసబు కరణంగారు చూచుచుండిన్ని నేను రిపోర్టుయివ్వమంటే యివ్వక నిరాకరించి ప్రతివాదికి కుమ్మక్కుగా మాట్లాడినారు.. ప్రతివాదికొట్టవచ్చినకర్రను యిందుతో దాఖలుచేసుకున్నాను...

**13-11-1901** (Sd) K. V Narasimha Rao,

Process server.

☞ పరా:—ఈపైదోషికి గురిజాల సబ్ మేజస్ట్రేటుకోర్టువారిచే **15** దినములు శిక్ష విధింపఁబడినది.

బెట్టిన, దద్ది యొక్కరిపేరఁబ్రయోగముచేసినప్పు డట్టిట్టులుచేయు, నొక్కయెడ నేమియుఁజేయకే పోవుచుండెడుక్ 45

---

(2) మ...గురిజాలస్టేషనరి సబు మేజస్ట్రీటుకోర్టు వారిసముఖమునకు.

| | |
|---|---|
| ఫిర్యాది. నందా ..నరసింహ్వాము సా॥ జానపాడు. | ముద్దయిలు<br>I. పున్నము చినవీరన్న. II జానపాటి శీతారాముడు, III. జానపాటి రంగయ్య. సా॥ జానపాడు |

448-323 సెక్షక్ ప్రకారము వ్రాయించిదాఖల్ చేసుకున్న చార్జీ...

నేరముజరిగిన తేది—28-1-03

సదరు తేది సాయంత్రము $6\frac{1}{2}$ గంటలప్పుడు ముద్దయిలు శివద్రవ్యమును అపహరించినట్టు తమును నేను అన్నానని నాయింటికి .... వచ్చి నన్ను 1 టో ముద్దాయి జుట్టుపట్టివంగతీసేసరికి 2-3 ముద్దాయిలు గుద్దినారు......1 టో ముద్దయి కమ్మకులస్థుడున్ను 2-3 ముద్దయిలు అన్నదమ్ములున్ను 3 వ ముద్దయి కరణమున్ను అయియున్నాడు. ఆరోజు ఉదయమున నీరుకట్టుగింజలవిషయములో నేను 1టో ముద్దయి వివాదలుపడుతూవుంటే పయిగా 2-3 ముద్దయిలు కుమ్మక్కుగావచ్చె .. .. సదరు 1 టో ముద్దయి మిగులప్రసంగములుతిట్టుతూవుండేసరికి పయిగా 2-3 ముద్దయిలు నన్ను కొట్టినారు. ....

☞ షరా:—ఈకేసు విచారించిచార్జిచేసినతర్వాత కాశిరాజు గోపాలకృష్ణయ్యగారి ద్వారమున ఫిర్యాదికి ఖర్చులిచ్చి రాజీపడిచుకొన్నారు.

(3) .....తీర్పు

| ఫిర్యాది. | ముద్దయిలు | |
|---|---|---|
| జానపాటి పట్టాభిరామశాస్త్రి-జానపాడు | కాటూరు నారాయణ.<br>వల్లవెల్లి కోటయ్య | జానపాడు |

నేరము—తిట్టవలెననితిట్టుట, గుఱ్ఱము నక్రమముగాఁబట్టికొనుట, ఇం॥ పి॥ కో 504 వ సెక్షనుక్రింద, 1871, 1 ఆక్టు 21 సె॥ క్రింద శిక్షింపఁదగినది.

ఎట్లుకనుగొనఁబడినది— నేరస్థులని

శిక్ష—ముద్దయి లొక్కొకరు, రు 15 లు జరిమానా యీవలసినదనియు, లేనియెడల 15 దినము లొక్కొకరు కఠినశిక్షయనుభవింపవలసినదనియు, కోర్టుఫీజాక్టుక్రింద ముద్దయిలిద్దఱు రు 2-8-0 లు సమానభాగములుగా ఫిర్యాదికీవలెననియు.. ...

గురజాల 31—1—13 } (Sd) పి. యమ్. సోమయాజులు, స్పేషల్ మేజస్ట్రేటు

మత్తకోకిల॥ అప్రతిష్ఠకు మూలమైయిటు లాప్రతిష్ఠ సమాప్తికా
విప్రవర్యులమీఁది ద్వేషము వేర్లుపెట్టెఁ బ్రవృద్ధమై
యీప్రకారముయొక్కవత్సర మేగుపై దురదృష్టతన్
స్వప్రతాపముఁ జూపెగత్తర జానపాటఁ బ్రవేశమై 46

ఆ॥ అప్పుడాడలు పెరిఁగెనఁట కొంతమందికి
అమ్మవారు పూనెనంట లెస్స
యంత్రహారణమైనయక్కారణంబునఁ
దొలఁగె సత్తయనుచుఁ బలికిరంట 47

చ॥ పుడియఁగ గ్రామమందు బలుమంది ప్రజల్ కలరాగుణంబునన్
గడగడలాడఁ గందొడఁగి గ్రామశియుక్ మునిసీబు కాపులున్
ముసుపులుకట్టి శక్తులకు మ్రొక్కి యొకింత శమించినంతనే
తడయక జాతరల్ సలుపఁ దామొదలొనఁదలంచి యంతటన్ 48

ఉ॥ "మేలొనగూడఁగం బ్రజకు మేమొనరించెదమిప్డు కొల్వులన్
జాలధనంబు కావలెను జాగొనరింపకయుండ"టంచుఁ జం
దాలు వసూలు చేసి యొకతక్షకుఁ దోడ్కొనివచ్చి రప్డు యం
త్రాలను వేయఁగన్ మరలఁ దద్దుఁడొకండును లేకయుండుటన్ 49

ఉ॥ వచ్చిన తక్కలాడు నొకవాసరమందట రాజవీథిఁ దో
డ్తెచ్చిన వారలై చదురుదీర్చి డిపట్టున నేను నెందుకో
యచ్చటఁ బోఁదటస్థమయి యందఱకోరికెఁ గూరుచుండియున్
దచ్చరితంబు సర్వమును దాలిమితోడుత నాలకించితిన్ 50

చ॥ అరిగిరి "యేమి తీసుకొనె" దంచుఁ గలాదుని నందఱప్పుడా
తఁడు సిగభూములే మొదలు, దానికి నొప్పమినూఱులాఱులే
యడిగను, మాయుదారులకు నయ్యెడియున్ భరమై పదింటికే
యొడఁబడ వేఁడి, రప్పుడొకయుక్తియు బల్కఁగఁ దోపకుంటి నేన్ 51

మ॥ ఎఱుఁగన్ రామిసిగాడు బ్రాహ్మణ్యమె మహిన్ హెచ్చైన వర్ణంబటం
చెఱుఁగన్ రాసిది కాదు తక్షక కులం బేదానికిం దక్కువం

చెల్లుకెకూడ మదీయవర్ణజనులం దీరీతి ద్వేషించి యూ
నరుఁబూజింపఁగనున్న వారియెడలన్ నానాల్క యేమూడెడిన్ 52

ఉ॥ చూపితివ్యంగ్యపున్ నుడుల నుంతయు నిష్టము లేనిభావమున్
నాపలుకుల్ గ్రహింపఁగలనాథుఁడు లేఁడట,నింతకన్న నున్
గోపవిఘూర్ణితాత్ములయి కొట్టుట కేనియు జంకకుండు నా
పాపులలోన నేమియని బైటికి రాఁగలవాఁడ నయ్యెడన్ 53

చ॥ ఇదియునుగాక యంత్రము లెయ్యాతఁడు స్థాపనఁ జేయునన్న నాల్
పదుగురునోళ్ళనుండియు నుబల్కఁగఁబడ్డది కాని, యయ్యెడన్
విదితముకాదొకింతయును విగ్రహసంస్థయుఁ జేయునంచు నా
కెద కదియేమొ యూఁగఁబడి నేమనచింతుకొ నెట్టులుండునో 54

మ॥ ధరణిన్ నేర్చిరి శాబరాదికముశాంతంత్రాల్ ద్విజన్మేతరుల్
మెఱయఁగూర్చుచు వాని బీజములచే మేలైనయంత్రంబులన్
దిరుగం జొచ్చిరి, కొంతమందిజను లీక్షీణత్కమంత్రంబులన్
బరమోత్కృష్టతఁజూచుచుండిరి మహాశుంతాన్నిన భిజ్ఞాత్మతన్ 55

తే॥ అట్టులేయాతఁ డెవ్వనియంత్రములను
స్థాపనము జేయు విగ్రహాధఃప్రదేశ
మందటంచును నెంచితి నగనె కాని
యప్రతిష్ఠకు సిద్ధమా నంచెఱుంగ 56

మ॥ "ప్రతిమందిరముకయంత్రసంస్థయెటులం బ్రాపించు" నంచందు రేన్ ?
క్షితిఁ బెక్కండ్రిటు చేయుచుంటకలదే, సిద్ధాంతమీమాట, "యీ
కృతి శాస్త్రోక్తమ?" యన్న; తత్కునకీకృత్యంబదే శాస్త్రప్ర
తతియందున్నదియో వచింపవలెగా? తత్ప్రచ్ఛకుల్ ముందుగన్ 57

తే॥ అచట నా యూహకరణమున నుజుఁడైన
సీతయూహ్యాయుఁ డొక్కింత నీతియుతుఁడు
కష్టయున్నను బాధితపక్షపాతి
కానఁ నాపైని స్నేహంబుగలిగియుండు 58

మనములనిశ్చయించి సురమార్గమునం దగ దక్షిణోత్తరా
యణవిలసచ్ఛలంబుల విహారము సేతురు భానుచంద్రముల్ 81

క॥ నూతనకేతువ్రాతా।న్వీతాంశుకజాతవాతవీతశ్రమ సౌ
ఖ్యాతతమై మానికసం।ఘాతము తత్పురము తరమె గణుతింపంగన్ 82

సీ॥ కర్పూరకాశ్మీరగంధచర్చితవృత్తి
గురుపయోధరములఁ గుప్పళించి
కజ్జలపంకరేఖామిళద్భృంగాళి
నేత్రసారసముల నృత్యమాడి
కస్తూరికాతిలకప్రశస్తమనోజ్ఞ
ఫాలస్థలంబులఁ బరఁగువాణి
బంధురసౌరభప్రసవమాలావృత్తి
కబరీభరంబులఁ గంతువైచి
తే॥ గంధవహసంజ్ఞసార్థకగతిని జెలఁగఁ
జండతరపుండ్రకోదండభండనోగ్ర
జాతసంశ్రమమణఁగించి సౌఖ్యమొసఁగు
వాతపోతంబుతత్పురివనితలకును 83

తే॥ రమ్యబహుళార్తి చేఁగుందు రాజుపొందు
చాలుమాకనితారకాజాలమెల్ల
నచటికేతెంచియుండెనోయనఁగనూత్న
రత్నములచేతవిపణిమార్గంబులొప్పు 84

క॥ రంగద్భటసారంగతు।రంగోద్భటపటుశతాంగరాజిచెలంగన్
శృంగాటకస్థలంబులు।శృంగారముగాఁగ నగరసీమఁబొసంగున్ 85

సీ॥ విప్రవరోన్నతి వెలసియుందురుగాని
తతపక్షపాత సంయుతులుగారు
ద్విజరాజకీర్తిస్ఫూర్తిఁ దేజరిల్లిరిగాని
ఘనగురుప్రమదానగతులుగారు

బాడబవిఖ్యాతిభాసిల్లుదురుగాని
బహుజనోద్వృత్తి నై భవులుగారు
బ్రహ్మసంతతియనఁ బ్రబలియుందురు కాని
చిరపంకజాతసంస్థితులుగారు
తే॥ వీరలంచు నుతింతురువిబుధవరులు
జ్యోతిష వ్యాకరణనిరుక్తేతిహాస
వేదవేదాంతసిద్ధాంతవిశ్రుతార్థ
వాసనాభాసురులు పుర్భూసురులును 86

సీ॥ మహనీయవిపులధర్మగుణప్రకాశులు
రణములందును వితరణములందు
రమణీయతర రాజ రాజసమానులు
ధనములందును మానధనములందు
కమనీయకల్యాణ దమనోరు చిరవృత్తు
లర్థులయందుఁ బ్రత్యర్థులందు
వర్ణనీయఖగానివార్యవిస్ఫూర్తులు
కరములందును రుక్మకరములందు
తే॥ కలితతుంగతురంగరంగచ్ఛతాంగ
మంగళాభంగ మాతంగసంగరాంగ
ణాంగపాటన భటచతురంగ బలవి
రాజులై యొప్పు నప్పురిరాజులెల్ల 87

క॥ రత్నాకరరోహణగిరి। రత్నములకనంతరత్న రాజత్సుమహా
యత్నతసమతఘటించి ఖ।రత్ననిధులుపొల్తు రప్పురంబున వైశ్యుల్

చ॥ హరిపదభక్తి సంభరణతాహతసస్తుల దుస్తరాఘులై
హరిపదభాగ్యభోగ్యశుభదాతృయవిశ్రుతభోగభాగులై
హరిపదవీధిరోధక మహోన్నతతాద్భుతధాన్యవంతులై
హరిపదపంకజాతభవు లప్పురిఁబొల్తు రసంతసౌఖ్యులై 89

సీ॥ వేదండముల నెంచుఁ గోదండముల నొంచుఁ
బోలునైనయానముల్ భ్రూయుగములు
కులధరంబుల మీఱు జలధరంబులఁ గేరుఁ
గుచకుంభయుగళముల్ కచభరములు
ఫణిరాజముల దూఱు మణిరాజముల మాఱు
వింతనూగారులు దంతములును
మధుకరంబులఁ దోలు విధుకరంబులఁ బోలు
నందమౌచూపులు హాసములును
తే॥ బాగుగాఁ గల్గియుండు నప్పట్టణమున
శంబరాంతకశాంబరీడంబరావ
లంబమోహనరుచిరకలాకదంబ
కలితయువలోకవతులైన కన్నెసతులు 90
సీ॥ "నాతిరో! చూపవే నల్లకల్వలదండ
పగలు చూపఁగ రాదు సొగసుకాఁడ!
పడఁతి! గోరంటపూబంతులిచ్చెదవఁటే?
రహిఁ వాడిచెడిపోవు రమ్యకాంత!
ఇంతి! యీలతికూన కేలపుష్పము లేదె?
వర్షముల్ చాలవు వన్నెకాఁడ!
తరుణి! గొంటెనవిరి దాఁచనేటికి? వేళ
రా మాటు సేతు నా కోమలాంగ!"
తే॥ అనుచుఁ బుష్పములమ్ముచు నప్పురమున
విమల మందారకుందారవిందకంద
రాళహల్లకమల్లికారమ్యబంధు
జీవికలు పుష్పలావికల్ చెలువుమీఱి 91
సీ॥ హరినీలచకచకల్ నెఱయుకీల్జడల చేఘురులవిస్ఫూర్తి చీకాకు చేసి
నిద్దంపుటద్దంబు నిగ్గొను మోములరాజమండలలీల రహిఁదణంచి

తీరైనచీమలబారుగేరారులభోగులనిలుకడల్ పోవఁ జేసి
సురపొన్న పువ్వుల సొరలించునాభుల సరసులగంభీరగరిమ మాన్పి
తే॥ వన్నెకెక్కిరి యప్పురవరమునందు
సతులవై సారిణాంక శాస్త్రార్థకలిత
మృదులసంగీతమంగళమిశ్రనృత్య
సారచాతుర్యవతులైన వారసతులు 92

సీ॥ ఊరూరుసంయుక్తి నొదవినయప్పుడు
సలలితరంభాప్తిఁ గలిగినటులఁ
బొలుపొంద మధ్యముల్ పొదవినప్పుడు మాని
తానందలీల మిన్నందినటులఁ
గులుకుకుచంబుల గోరంటినప్పుడు
ప్రాచుర్యగతిఁ గొండఁ బ్రాఁకినటులఁ
గీజ్జెడల్ సందిటఁ గీలించునప్పుడు
చిరఘనైశ్వర్యముల్ చెందినటుల
సంతసింతురుతమలోన సాంద్రచంద్ర
చంద్రికాభాసమానచంచత్ప్రదేశ
వారనారీమణీరతి వైభవములఁ
బట్టణమునందు మన్మథభటులు విటులు 93

సీ॥ "దీప్తితాహీనభూతివిరాజితంబులై
కలితనాగేంద్రలీలలఁ జెలంగ
ఘనదానవిభవప్రకాశమానంబులై
కర్ణాధికశ్రీలగణనకెక్క-
వితతనీలాంబరప్రతిభలనొప్పారి
బలభద్రగతులచేఁ బరిఢవిల్లి

అతులితపురుషోత్తమాభిరామంబులై
కమలాహితోన్నతుల్ గలిగిమెసఁగ"

సనుచుసర్వజనంబులువినుతిసేయ
వెలయుసురకుంజరవిశేషకలితరదన
శతభిదురప్రహారచూర్ణీకృతాంగ
శిఖరములు పట్టణముగంధసింధురములు 94

సీ॥ "విజయప్రభావత విలసిల్లియుండియు
సైంధవస్ఫూర్తిఁబ్రశస్తమయ్యె
రహిని శ్రీకంఠాభరణసమున్నతిగాంచి
బహుళసదాగతిప్రాప్తి నెసఁగె
కమనీయతరహరిఖ్యాతిఁబెంపొందియుఁ
బున్నాగసంగతి వన్నెకెక్కె
నిరుపమదేవమణిప్రకాశతమించి
పరిబలభీకరస్ఫురణ నెసఁగె"

ననుచుఁ బురిఁ జిత్రముగ జను లభినుతింపఁ
బరఁగఁగల్యాణపల్యాణబద్ధయుద్ధ
కాలరింఖానిశ్శృంఖలాఘాతజాత
ధరణితలధూళిపటలంబుతురగకులము 95

సీ॥ శతపత్రనేత్రాప్రసవ్యబాహుప్రభంగి రంజితచక్రనిర్వక్రమగుచు
రమణీయధారాధరద్వారమునుబోలిచిరతర కేతుసంస్థితమగుచు
గలధౌతభూమిభృత్తిలకంబుగమరిక రాజావతంసాభిరామమగుచు
జంభాసురారాతికుంభిరాజముభంగిఁ గల్యాణకుంభవిఖ్యాతమగుచుఁ

బరఁగెనచ్చోటరోహణభర్మశైలరంగదుత్తుంగశృంగారశృంగదివ్య
మంగళవిలాసభూసురభంగనూత్నరత్నహేమమయంబుసద్రథచయంబు

క॥ హరిఁగఱకటినుఱుమాడుదు। రరిమురిగిరుతెగురనైతురతిసత్త్వములన్
భూరిపొరిఁ బిరుసులుగలిగిన। కరిపురవరపౌరభటులు కలహారభటులై

ఉ॥ చాలుగ నొప్పుచుండు నవచందనకుందతమాలతాలహిం
తాలగసాలసాలవటదంతశరామ్లలవంగలుంగత
క్కోలకదంబముఖ్యతరుకుంజసముజ్జ్వలపుష్పమంజరీ
జాలసుగంధబంధురవిశాలమహావనపంక్తు లప్పురిన్ 98

సీ॥ వంకెలు జవ్వాజివంకేలు పొన్నశ్రీ
రాజనాల్ విప్పపూరాజనాలు
మల్లెశ్రీగంధులు మదనగంధులు రామ
బాణముల్ మన్మథబాణములును
గర్పూరములు పచ్చకర్పూరములు జున్నుఁ
బాలవడ్లును ముద్దుఁబాలవడ్లు
గుత్తులు మామిడిగుత్తులు బంగారు
తీఁగియల్ పగడంపుదీఁగియలును

మోహనసతులు లక్ష్మీమనోహరాలు
భారతీభూషలును బొంగుఁబాలు గౌరి
కుంకుమలు నను పేళ్లతోఁ గూడి వడ్లు
తలుచుగాఁ బండు నచటి కేదారములను॥ 99

వ॥ వెండియుఁ దత్పుటభేదనప్రకాండంబఖండోద్దండవేదండగండస్థలకరి
చ్యుతానూనదానధారాసమాకలితభూమండలాఖండలకోటీరకోటికుటి
ఘటితశతకోటిభృచ్ఛిలాద్యఖిలమాత్నరత్నసందోహనవ్యసంఘర్ష
ణవిగళద్రజఃపుంజరింఖత్కంఖాణారింఖాణసంఘాతసంఘట్టనాత్యంత
పంకిలంబులగు రాజమార్గంబులవలననుకోహణీకాంతాకాంతకాం
తోపలసౌధయూథవిహారమాణభూకాంతశుద్ధాంతకాంతా క్రాంత

సమర్పితాసితాగరుధూపధూమస్తోమసంజనితాదభ్ర శుభ్రేతరచ్ఛా
యాభరితాభ్రవిభ్రమాంగీకృతరంగత్తాండవాఖండకేళిప్రఫుల్లకలాపక
లాపికలాపసముల్లసితశోభకంఠకలకంఠకంఠపంచమకుహూకారకోలాహ
లనినదోద్యదుద్యానాభ్రంకషవిశ్వంభరాజాతసంజాత శాఖోపశా
ఖాశిఖాంతర కులాయప్రవర్ధమానశుంభత్కీరడింభసంగ్రస్తప్రశస్త
సవ్యదివ్యవిమానయానాతాయాతసుధాంధస్సౌగంధిక గంధిజనమధుర
మధురసాసారచమత్కారగంభీరవిలాసవాగ్విశేషంబులవలనను,సం
గీతభరతకళాశాస్త్రప్రవీణవారశోణాధరితాండవైజృంభణవాచాల
రత్నతులాకోటికంకణకింకిణీక్రేంకారచరద్గంధబంధుర సింధురకంధ
రాబద్ధరణద్బృంహితాఘణఘణాత్కార భూరిభేరీధణంధణాత్కార
కోలాహలపిచండిలపుండరీకభవాండభాండంబులవలనను, నితాంత
దీక్షిమంతినీసీమంతసిందూరతిలకాయమానబహుళప్రభాభాసమానార
విందరాగశిలాసందోహసంఘటితప్రశస్తహస్తాంచలాంచితకాంచనపాం
చాలికాసంచయంబులవలనను, సల్లలితమల్లికావల్లికామతల్లికావేల్లిత
సాంద్రచంద్రకాంతాలవాలవిశాలబాలరసాలసాలతాలహింతాలతక్కో
లతమాలప్రియాళు నారికేళసరళవకుళముఖనిఖిలతరు వరనికరనివసిత
నీలకంఠకలకంఠిక పోతశారికాకీరికా బహుళబకాది నానావిధపత్రర
థయూథనిర్భరోధకలకలారావాభంగశృంగారవనంబులవలనను,అంబర
చుంబి మహోన్నతసేతుసమాయతతటాకప్రసృతసిరధారానిరంతరఫలి
తశాలిసస్యమంజరీపుంజపింజరీభూతకేదారంబులవలనను, సారస కారం
డవ రథాంగ చక్రాంగ ముఖపయోవిహంగమిథునసంధువనకేళీసమాక
లితవిమలకమలకుముదసముదయమకరందబిందుతుందిలేందిందిరసుందరీ
ఝుంకారవిస్తారసారసాకరంబులవలనను, సంతతోత్సవంబై వైకుంఠ
నగరంబురీతి నమరావతీపురంబుభాతి భోగవతీపట్టణంబుగతిహరిప్రకాశ
మానంబై వర్షాకాలంబుపోలికఁ జంద్రమండలంబులీలఁ బుష్పవాటివి

ధంబున సారంగాభిరామంబై కమలాకరంబుభంగి నిశాహంబులచా
డ్పున రాజహంసవిరాజమానంబై యలకాపురంబు బాగున లంకాపురం
బులాగునఁ బుణ్యజనేశ్వరాధారంబై యయోధ్యాపట్టణంబుచొప్పున
ద్వారావతీనగరంబుడంబున రామాభిరామంబై వారుణదానధారాప్ర
వాహబహుళంబయ్యును వారణదానధారాప్రవాహబహుళంబై వనీప
కామితార్థసంధాయకంబై కమలప్రపూర్ణకమలాకరంబయ్యును విమల
ప్రపూర్ణకమలాకరంబై భువనవర్ణనీయంబయ్యును భువనవర్ణనీయంబై
సంపదలకుఁబుట్టినిల్లును సౌభాగ్యంబునకుస్థానంబును నగుచు వసుంధ
రాపురంధ్రీరత్నకటకంబై యొప్పు నక్కటకంబున 100

మ॥ కలఁ డాఖండలతుండితుండసదృశాఖండోరుదోర్దండనో
జ్జ్వలకాండాసనకాండభృద్భవదృఢాంచచ్చండకాండచ్ఛటా
జలధారాళమిత్రోగ్రవిగ్రహమహోత్సాహాహితోద్దండభూ
పలసచ్ఛౌర్యధనంజయుం డల ప్రదీపక్ష్మామహేంద్రుండిలన్॥ 101

సీ॥ ప్రాభవానంద మహాభోగజిష్ణుండు
రంజితతేజోధనంజయుండు
సౌభాగ్యనిరుపమోజ్జ్వలసత్యధర్ముండు
ద్యుచ్ఛాయపుణ్యజనోత్తముండు
వరశౌర్యగాంభీర్యవాహినీశ్వరభర్త
భాస్వత్పరబలప్రభంజనుండు
భూరితరాంచితోద్ధారధనేశుండు
శాశ్వతైశ్వర్యమహేశ్వరుండు

గీ॥ బళిర? యీతండనంగనొప్పారుఁ గుధర
వలయితనతద్వయాద్వీపకలితలలిత
సర్వసర్వంసహాభరాశ్రయనిధాన
జన్యకేళి ప్రదీపరాజన్యమౌళి॥ 102

# చందాదారులు

1 తుళ్ళూరు పిచ్చయ్యగారు, గుంటూరు
2 చల్లా సీతారామయ్యగారు, సత్తెనపల్లి
3 చింతపల్లి చెలమయ్యగారు, కరణము, మేళ్ళవాగు
4 వారణాసివిశ్వనాధశాస్త్రిగారు, నేటివుడాక్టరు, ఎఱ్ఱగుంటపాలెం
5 రావిళ్ళ రామలింగమునాయఁడుగారు, కొరుటూరు
6 రాళ్ళభండి రాజయ్యగారు, విలేజిమున్సిఫ్ - చింతిరాల
7 తంగిరాల ఆంజనేయులుగారు, ప్లీడరు- బాపట్ల
8 మేళ్ళచెర్వు చినరామస్వామిగారు, కరణము- చినపాలెము
9 చల్లా కామేశ్వరరావుగారు, అగ్రికల్చరల్ సూపరువైజరు, విశాఖపట్నము
10 కొండ భోగిభూషణరావుగారు, చినకోండ్రుపాడు
11 చల్లా పిచ్చయ్యగారు, గణపవరము
12 దండెంరాజు జానకిరామయ్యగారు, కరణము, పిడుగురాళ్ళ
13 అక్కిరాజు లక్ష్మీనారాయణగారు, కరణము, గుత్తికొండ
14 వల్లూరి నరిసింహారావుగారు, గుంటూరు,

# గుంటూరుసీమ ఉత్తరరంగము

200వందల పుస్తలకుఁ గొంచెముతగ్గియుండును, ఏప్రిలు నెలాఖరులోగా రు 0-8-0 లు, (పోస్టేజీగాక) పిమ్మట రు 1-0-0 (పోస్టేజీకాక) మే యి, జూను నెలలు సెలవుదినములగుటచేఁ గ్రంథకర్తలు గ్రామాంతరమందుండుటచే బుక్కులు దొరకవు; కానత్వరపడవలెను.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శతావధాని,
బైరవప్రస్సు, బందరు.

## ప్రధాన పోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు
జమీందారుగారు గంపలగూడెం

## పోషకులు.

1 శ్రీ రాజా నారాయణప్పారావు సింహాద్య్రప్పారావు బహదరు
జమీందారులు, నూజవీడు.

2 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

3 రామసింగుగారు నెల్లుట్ల పాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల

4 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు

6 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు నందూరు

2 నందూరు నరసింహారావుగారు, కరణం, నందూరు.

3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

4 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

5 కుప్పా శంకరశాస్త్రిగారు, చిపలూరు.

6 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.

7 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.

8 కొండపల్లి అనంతరామయ్యగారు, వకీలు. జోనగాం.

9 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.

10 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

11 తంగె నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

12 చెన్నూరు రామమంగారావు దేశపాండ్యాగారు, పెదవీడు.

13 వాసిరెడ్డి వెట్రెయ్యగారు చేబ్రోలు.

14 వెలుగూరి పిచ్చయ్యగారు, కొడముగుండ్ల.

15 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

16 వెంకటరామకవులు, పల్నాడుతాలూకా

17 దెందుకూరి బ్రహ్మాందీక్షితులుగారు గుంటూరు.